# ఈశ్వర శతకము



డా॥ అందె వేంకటరాజము, ఎం.ఏ., పిహెచ్.డి.
రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకుడు
కోరుట్ల.

EESVARA SATAKAMU
By
Dr. ANDE VENKATARAJAM, M.A., Ph.D.
Retired Telugu Lecturer
KORATLA - 505 326, Dist. Karimnagar - A.P.

ఈశ్వర శతకము

డా॥ అందె వేంకటరాజము, ఎం.ఏ., పిహెచ్.డి.
రిటైర్డ్ తెలుగు లెక్చరరు, కోరుట్ల

ప్రథమ ముద్రణ : వేయి ప్రతులు

నవంబరు 1993

సర్వస్వామ్యములు రచయితవి

ప్రచురణ :
మహేశ్వరీ గ్రంథమండలి, కోరుట్ల
చతుర్థ కుసుమం

వెల : రూ. 10-00

ప్రతులకు :
డా॥ అందె వేంకటరాజము
మహేశ్వరీ గ్రంథమండలి,
2-3-18, మార్కండేయ మందిరం వద్ద,
కోరుట్ల - 505 326, జిల్లా కరీంనగర్, ఆం.ప్ర.

ముఖచిత్రాలంకరణ : శ్రీ అలిశెట్టి మహారాజు

ముఖచిత్ర ముద్రణ :
బాలాజి ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600547

డా॥ రావికంటి వసునందన్, ఎం.ఏ., పిహెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షుడు, హైదరాబాదు
డా॥ బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం తేది : 2-11-93

# అభినందన చందనం

కావ్యగుణాలైన "కాంతాసమ్మితోపదేశం, సద్యః పరనిర్వృతి" తన కవితా లక్షణాలు కాగా; యశస్సుకన్నా ఐహిక ప్రయోజనాలకన్నా - "శివేతరక్షతమైన" సత్సంకల్ప బలంతో - అందాలుచిందే మధురపదానంద బంధాలను రసాస్పద కందుకాలుగా చిందులువేయించే"మధురకవి-కవిసుధాకర-కవిశిరోమణి" డా॥ అందె వేంకటరాజముగారు. ఇవి సన్నుతులు కావు - ఈ కవివతంసుని కవితావిలాసాలకు ప్రణతులు.

అందమైన మనిషి. ఆజాను బాహువు. మధుర భాషణుడు. హితైక వాక్కు. విద్యా వివేక వినయ విజ్ఞాన శేముషీ భూషితుడు డా॥ వేంకటరాజము గారు. ఈ గుణాలలో ఏ ఒక్కటి ఉన్నా మనిషి నేలమీద నడవడం కష్టం. ఆ గుణాలన్నిటినీ తన కవితా గుణాలలోనూ ప్రతిఫలింపజేసుకున్న, ఫలింపజేసిన సుమనస్స్వభావి ఈ మహనీయుడు.

ఆర్ష విజ్ఞాన పరిణతి, వాస్తుశాస్త్రపాండితి, జ్యోతిర్విద్యా పరిచితి, సద్విమర్శ, సత్కవిత - ఇన్ని లక్షణాలను రంగరించుకున్న వేంకటరాజముగారు వెలయించిన రసవత్కృతులు అనేకాలు. ఆ కృతులన్నిటిలోని పరిశ్రమకు పట్టుగొమ్మ "ఈశ్వర శతకము."

శతకం అంటే వంద అని అర్థం. ఒకే విధమైన నూటఒకటిగాని, నూటఎనిమిదిగాని పద్యాల కూర్పును శతకంగా వ్యవహరిస్తున్నాము. నిజానికి శతకం ముక్తక ప్రక్రియకు చెందిన కవితా పద్ధతి. ఏ పద్యానికదే ఒక సంపూర్ణభావంగా కథ ప్రసక్తి లేకుండా ఉండడం ఈ కావ్య లక్షణం. కొన్ని వేల సంఖ్యలోవున్న

వేమన పద్యాలను శతకంగా జనం వాడుకోవడం చూస్తే - ముక్తకమే శతక ప్రక్రియకు దారి తీసిందని అనిపిస్తుంది. శతకంలో ప్రతి పద్యం చివరా కనిపించే 'మకుటం' - ముక్తకానికీ శతకానికీ నడుమ గీతగీసి చూపిస్తుంది తప్పితే స్వభావం ఒక్కటే. శతకాలకు వస్తువులు సాధారణంగా "శృంగారం, నీతి, అధిక్షేపం, భక్తి, వ్యాజస్తుతి, దురాచార నిరసనం" వంటివి. వీటిలోని కొన్ని అంశాలనుగానీ, అన్ని అంశాలనుగానీ సాధించిన కవితోపాసకులున్నారు. కవిత్వాన్ని శతకరచనతోనే ప్రారంభించిన అభ్యాసులూ ఉన్నారు. డా॥ వేంకట రాజంగారి రచన, ఉత్తమ శతక వస్తువులన్నింటినీ కలగలిపి, భక్తితోపాటు - జ్ఞాన వైరాగ్య ప్రపత్తి యోగాలను ఆవరణాలుగా కూర్చుకొని ఆవిర్భవించిన పరమ మధుర పరిణత కవిత. ఈ శతకంలోని ప్రతి పద్యమూ ఈ మాటకు సాక్ష్యంగా నిలుస్తుంది తెలుగు సంస్కృత సుందర పదబంధాలకూ, ఆ భాషల అందచందాలకూ ఆదర్శంగా మెరుస్తుంది. వైరాగ్య పురస్కృతమైన లోకజ్ఞతా గుణ ప్రకటన ఈ రచనలోని విలక్షణత.

శతకాన్ని ప్రారంభిస్తూనే కవి "శ్రీమద్విశ్వ విరాట్స్వరూప" అంటూ లోకాధారుడూ, లోకారాధ్యుడూ ఐన శతక నాయకుడిని ఆవాహనచేస్తూ "భువన క్షేమంకరోద్యోగ" అని ప్రస్తుతిస్తారు. శివేతరక్షతిని ఈ రచన లక్షించి కొన సాగిందని నా మొదటివాక్యంలోనే అన్నది అందుకే. సకల భువన సంక్షేమాన్ని నిర్వహించగల పరమేశ్వర గుణాలతో ఈ పద్యాన్ని ముగిస్తూ- "నిన్ శరణందు జన్మము కృతార్థంబౌటకై ఈశ్వరా!" అంటూ తమ రచనా వ్యాసంగం దేనికోసమో ప్రకటిస్తారు. ఈ సంవేదన "శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అన్న పోతన్న భక్తి సంపన్నతను తలపించటం లేదా?

మానవ స్వభావం గుణదోష సంగమం. అనేక జన్మల పుణ్యాతిశయం చేత ప్రాప్తించినా "నరజన్మ దుష్కర్మావిల" మనీ, అది నిన్నే 'గతి'గా తలంచినప్పుడే సార్థకమనీ ఈశ్వరునికి నివేదిస్తూ మానవజన్మ రహస్యాన్ని వెల్లడిచేస్తారు రెండో పద్యంలో.

"భక్తిలేని పూజ పత్రిచేటు" అన్నట్టుగా- నీ పూజచేస్తూ పాపకార్య నిమగ్నులయ్యేవారు, పుట్టిలో గంగనుదాట ప్రయత్నిస్తూ, దానికే చిల్లులు పెట్టే

ప్రబుద్ధులనే చక్కని ఉపమానంతో భక్తితత్వాన్ని వివరిస్తూ, "చిత్తశుద్ధిలేని శివపూజలేలరా?" అన్న వేమన్ననూ తలపిస్తారు ముచ్చటగా మూడో పద్యంలో.

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే" అన్న కవికుల గురువును తలపిస్తూ "వరసాహిత్య సమర్చనార్థం" తగినంత కలిమినే చేకూర్చమంటారు నాలుగో పద్యంలో. ఇలా ఉదాహరిస్తూ పోతే వేంకటరాజంగారి ప్రతి పద్యమూ ఒక రత్నరాజమే. ఈ విధంగా ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకం, దీపకం, స్వభావోక్తి వంటి సురుచిరాలంకారాలతో విరాజిల్లుతున్నదీ రచన. దానికి తగిన శబ్దాలంకారాలూ ఉన్నాయి. ఉదాహరణలు గ్రంథ విస్తరణ భీతిదములు.

ఆదిదేవుల అసలు తత్వాలను కూడా లోక సాధారణమైన అతి చిన్న విషయాలతో పొసగించి మేలమాడగల సునిశిత హాస్యం ఉన్నది ఈ కృతిలో. అంగబలమో, అర్థబలమో ఉన్నవానిదే ఈ లోకంలో రంగరంగవైభోగం. ఆ రెండూలేని బ్రహ్మనెవడైనా చింతిస్తాడా శివకేశవులను తప్ప - అంటారు 59వ పద్యంలో; అచ్చమైన విద్యార్థులకు ఆదరణ లేదనే చేదు నిజాన్ని గరళకంఠుడై దిగమ్రింగుకుంటూ.

"జలముల నగ్ని ఛత్రమున చండమయూఖుని" అన్న సుభాషితానికి మెరుగులు దిద్దుతూ "శ్రేయోభక్తిని - ఉత్కృష్టంబుగా - జన్మజేయగదె" అని ఈశ్వరుని వేడుకుంటారు 56వ పద్యంలో నిర్భర భరన్యాస దీక్షతో.

ఆంధ్ర సంస్కృత పదాలకు అక్కడక్కడా తళుకులు సమకూరుస్తూ "ఖాయము, బాజారు, బెస్టరు" వంటి దేశిపద గంధాలూ గుబాళిస్తున్నాయి. రచనలో జీవేశ్వర తత్వాలతోపాటు; సామాజికాంశాలూ, పురాగాథా ప్రసంగాలూ, లోకవార్తా పరామర్శలూ సముచితంగా, సమంచితంగా కనబడుతున్నాయి.

ధారాశుద్ధితో ప్రసిద్ధ వృత్తాలతో పరుగులు తీసిన ఇలాటి చేయి తిరిగిన కృతి ఆస్వాదనకు పాఠకునిలో ఎంతో సంయమనం అవసరం.

కవి సహజమైన కువిమర్శత నిరసనం (48వ పద్యం) తో పాటే, తాము నిర్విఘ్నంగా నిర్వహించిన అధ్యాపక ప్రవృత్తినీ చాటుకుంటూ (42వ పద్యం)

కృతిని ఆత్మీయతా ముద్రతో అలంకరిస్తారు. పూజారి, పూజారి శబ్దప్రయోగం (36 వ పద్యం) వారు చేసిన అధ్యాపక వృత్తిలోని ఒక సంప్రదాయ చిన్ముద్ర. "సత్యంబున్ ప్రియమున్ హితంబు మితమున్ సౌమ్యంబునౌమాటయే నిత్యంబున్ వచియించువర్తనము" (19 వ పద్యం)— అనే పద ప్రయోగంలోని కవి ఆత్మీయతను ఈ పరిశీలన ప్రారంభిస్తూనే సూచించడం జరిగింది.

"తప్పుల్ చేసెద బుద్ధి తక్కువయి నాతండ్రీ!" అని (80 వ పద్యం) ఎంతో గోముగా ఈశ్వరుని ప్రార్థించడమే కాదు—

"సమకాలీన సమాజమెల్లయెడలన్ సంక్షోభమున్ జెంది స
ర్వము దుష్టంబును నష్టమయ్యెననుచున్ వాపోయి తామందు భ్ర
ష్టముగా నేటికి? వ్యక్తి నిల్పుకొను చేష్టల్ కూడవే? పెన్ప్రవా
హము తీవ్రంబగుచో బదంబు పదిలంబై దాటరే ఈశ్వరా?" (55)

అంటూ "స్వయంతీర్ణః పరాంస్తారయతి" పద్ధతిలో సాగిపోతున్నారు. అంతటితోకాదు. సమకాలీనసమాజ దృక్పథంతోపాటు తనలోని జాతీయ ప్రేమనూ లోక కళ్యాణ కాంక్షాదైవంబగు భారతీయతనపేక్షన్ గొల్తునో యీశ్వరా! (పద్యం–99)— అంటూ జాతిగాలికి సుగంధాన్ని పులుముతున్నారు.

డా॥ అందె వేంకట రాజంగారు అరితేరిన సుప్రసిద్ధకవులు. దానికి కవితా సాక్ష్యంగా, కావ్యముఖంగా—సత్యంబై, శివమై, మనోజ్ఞమయి, విశ్వశ్రేయమై, సర్వకాలాత్మ్యంతోదయమై, యిహంబు పరమున్ బ్రాప్తించగా జేయు సాహిత్యంబున్ సృజియింతు (100 వ పద్యం)— అనటం ముమ్మాటికీ యథార్థం.

ఈ శతకంలోని చివరి పద్యం— తమ ప్రియ తమ జ్ఞానయోగ గురువు అవధూత శ్రీశ్రీశ్రీ గోవిందగిరి స్వామివారికి అంకితంగా, కవికేమో 'గద్య'గా అనవద్యమై ఉండడం హర్షణీయం. ఈ శుభసమయంలో ఈ నాలుగు మాటలూ రాసే అవకాశం నాకు కల్పించినందుకు ఆనందిస్తూ, కృతజ్ఞతాపూర్వకంగా అందిస్తున్నాను- అభినందన చందనం. అందెవారూ! ఆత్మీయంగా అందుకోండి.

# సాభిప్రాయము

"ఇహంబు పరమున్ ప్రాప్తింపగా జేయు సాహిత్యంబున్ సృజియించి నిన్గాలుతు" ననుచు శ్రీ అంచె వేంకటరాజముగారు తమ శతకాంతమున చెప్పియున్నారు. దీనివలన సాహిత్యమునకును ఇహపర సౌఖ్యమ్ముల నిచ్చు శక్తి కలదని తెలియవచ్చుచున్నది. "యద్భావం తద్భవతి" యన్నట్లుగా సాహిత్య సృష్టి చేయునట్టి కవియొక్క భావమును బట్టి, యతని కట్టి ఫలితమే లభించ గలదు. కావున ఇచ్చట కవి కోరుకొనుచున్నట్టి ఇహపర సుఖ లబ్ధి లభించగల దనుటలో సందేహము లేదు.

ఈ శతకమునందు సంబోధింపబడిన ఈశ్వరుడు సర్వమత సంప్రదాయ ముల వారిచే అంగీకరింపబడిన నామరూపాతీతుడు. అట్టి ఈశ్వరుని వర్ణించ గలుగుట ఎవరికైనను అసాధ్యమే. కావున కవిగారు ఆ జోలికి పోక, నవవిధ భక్తులందొకటియైన ఆత్మ నివేదనమును నిండించి ఈ శతకమును పండించి నారు. ఈశ్వరుని ఇతడు ఓంకారాత్మకా, సకలాజాండ విభూ, అనాథ జనరక్షా, కైవల్యాత్మకా, పరాత్పరా, తండ్రీ, ప్రభూ, స్వామి, జగదీశా, దేవదేవేశా, దేవా, కరుణామయా, వరదా, శ్రితజన వ్రాతావనా అని సంబోధించియున్నారు. ఇవి నిరాకార పరబ్రహ్మమునకు సంబంధించిన సంబోధనములే. ఇతనికి ఆ పరాత్పరుడే సరస్వతీదేవితో కూడిన బ్రహ్మగా, లక్ష్మీదేవితో కూడిన విష్ణువుగా, పార్వతీదేవితో కూడిన శంకరునిగా గోచరించి యున్నాడు. ఈ భావమును 62వ పద్యమున ప్రకటించి, కవిగారు తమకు బ్రహ్మ విష్ణు రుద్రుల యందును పరమాత్మ భావము కలదవి స్పష్టముగా వెల్లడించియున్నారు. "మూర్తిత్రయ మూలకారణలసత్తేజా" అని మొదటి పద్య మున చెప్పిన భావమే పై పద్యము నందు విపులీకరించబడినది.

ఈ శతకమున శార్దూల వృత్తములయొక్క మకుటమున ఈశ్వరుని కూర్చుండబెట్టుట వలన ఆతనికి నుగాగమ యణాగమముల బెడద తప్పలేదు. ఈ కృతిలో భక్తిపేరిట లోకమున జరుగుచున్న దురాచారములు చక్కగా దర్శింప

జేయబడినవి." నరులన్ భ్రష్టుల జేసి, స్వీయ మతముల్ పట్టింతు రాస్తిక్యమీ కరణిన్ వేసెను వెఱ్ఱి వేషములు" అనియు "మైకుల్ వచ్చెను భక్తియున్, భజనలున్ బాజారు పాలయ్యె, బూజా కార్యంబు నటప్రదర్శనముగా సాగెన్, త్వద్దారా ధనోత్సేకం బెంతయు యాంత్రికం బగుచు వర్తిల్లెన్, భవన్మందిరా నీకంబుల్ కుజనాళ్యధీములు బందెన్ మ్రందెదో యీశ్వరా" అనియు నేటి మూఢ భక్తిని, డాంబిక భక్తిని ఈ కవి నీటుగా మాటుగా విమర్శించినారు.

"వ్యోమ ఘటికా యంత్రంబునన్, సూర్యచంద్రములన్ ముండ్ల నమర్చి" అనుచోట కవిగారు తన కల్పనాత్మకమైన ప్రతిభను కనబరచియున్నారు. కనిపించని విద్యుత్తును టెస్టరుతో దాని ఉనికిని పరిశీలించినట్లు, పరమాత్మని సర్వత్ర పరిశీలించవచ్చునని చెప్పుటయు ఒక వినూత్న భావనము.

సకల యోగములందు రాజయోగము శ్రేష్ఠమని వీరి విశ్వాసము. "పరమా సత్వర రాజయోగము నినున్ బ్రాపించగా" అనుచు తన మక్కువ పెక్కువ రాజయోగముపై గలదని చాటుచున్నారు. వీరు తమ జీవిత లక్ష్యమును కూడా ఈ శతకము నందొకచోట "ఈ జన్మ సద్వశమై సత్పురుషార్థ సాధనలలో ధన్యత్వమున్ జెంది, సద్యశమున్ మోక్షము గాంచుటే ఫలము గమ్యంబద్దియె" అని స్పష్టముగా తెలిపియున్నారు. ఈ లక్ష్యసిద్ధికై వీరు కుండలినీ జ్ఞాన యోగులు, అవధూత శ్రీశ్రీశ్రీ గోవింద స్వాములవారి నాశ్రయించి, సదుపదేశ దీక్షలను స్వీకరించియున్నారు. వీరు తమ గురుదేవుని యొక్క గొప్పతనమును గూడా అత్యంత గురుభక్తితోడ "నరహృన్మందిర మందు సత్కరుణ, జ్ఞాన జ్యోతి వెల్గించి సాదర బోధామృత భక్తియోగ పథముల్ దర్శింపగాజేసి నీ పర తత్త్వంబు లభింప జన్మము తరింపన్ జేయు పుణ్యాత్మ, సద్గురు దేవున్ శరణమ్ము పొంది నుతియింతున్ భక్తితో—" —అని చక్కగా చాటుకొని యున్నారు. ఈ ఇరువదవ శతాబ్దమున ఇట్టి సద్గురు శిష్యులుండుట ఆశ్చర్య కరమే. ఇట్లు మదుర మనోహరముగా తన గురువును వర్ణించుటయేగాక ఈ కవి తన గురుదేవునకు ఈ శతకమును అంకిత మొనర్చుట అత్యంత శ్లాఘనీయము.

వీరి గురుదేవులు వీరి కృతిని స్వీకరించి పెల్లుగ నుల్లసిల్లుదురనుటలో సందేహము లేదు. వారు ఈ కవిగారికి కోరుకొనినట్టి యశో మోక్షముల లబ్ధికి తోడ్పడగలరని నా భావన.

ఉదాహరణ కావ్యమునందు అంకితాంక పద్యము వ్రాయబడునట్లే, ఈ శతకము నందలి చివరి పద్యము కృతికర్త కృతిభర్త పేరులతో కూడినదై యున్నది. ఈ పద్యములో కవి బోధన, కావ్య సాధనలలో రాజిల్లువాడనని చెప్పుకొని యున్నాడు. ఈ రెండు రంగములందును శ్రీ అందె వేంకటరాజము అందెవేసిన చేయి. కావ్య సాధనలో ఈ ఈశ్వర శతకము వీరి ప్రథమ శతకము. ఈ కవిగారిట్టి సత్కావ్యముల తోడ నిరంతరము కావ్యసాధన చేయుదురుగాక అని కాంక్షించుచున్నాను.

ఇట్లు
**గణపతి రామచంద్రరావు**
ప్రధాన కార్యదర్శి
అఖిల భారత గీతాప్రచార మండలం.

నిజామాబాదు
**31-10-1993**

# సమర్పణం

శ్రీమత్కుండలినీవిదం శుభకరం శ్రీసిద్ధయోగీశ్వరం
లోకారాధ్యపదాంబుజం భవహరం మోహాంధకారార్యమం
కారుణ్యామృతసాగరం గురువరం బ్రహ్మావధూతప్రభుం
శ్రీగోవిందగిరిం నమామి వరదం దివ్యప్రభావోత్తరమ్॥

యోగీంద్రా! గురుదేవ! కుండలిని సద్యోగంబుతో జాగృతిన్
బాగొప్పన్ బొనరించి దీవెనలతో వాత్సల్యపీయూషధా
రాగంగల్ ప్రవహింపఁ జేయఁగఁ గృతార్థం బయ్యె నా జన్మ మో
శ్రీగోవిందగిరిప్రభూ! శరణు తండ్రీ! దివ్యతేజోమయా!

కులమతప్రాంతభేదాల తలపు లేక
సకలజనులకు యోగ మ్మొసంగి పరమ
కరుణతోఁ దరింపఁగఁ జేయు గురువరేణ్య!
తమరికిన్ సాటి యెవ్వరీ ధరణిలోన?

అవధూతల్ కరుణామయుల్ పరమహంసాగ్రేసరుల్ దివ్యయో
గవరిష్ఠుల్ భగవత్స్వరూపులు జగత్కల్యాణసంధాయకుల్
భవపాథోనిధితారకుల్ షిరిడిబాబా సాయి భక్తాగ్రణుల్
స్తవముల్ చేయఁ దరంబె మిమ్ము మహితాత్మా! సద్గురు గ్రామణీ!

తరముగ భక్తిభావననిధానముగా రచియించినట్టి యీ
శ్వరశతకంబు భక్తిమెయి స్వామి! సమర్పణ చేసితిన్ గృపా
శరనిధి! స్వీకరించి నను జన్మకృతార్థత నొందునట్టు శ్రీ
గురువర! మేలు దీవెనలు కూరిమితోడ ననుగ్రహించవే!



కృతిపతి

కుండలినీజ్ఞానయోగి, అవధూత

శ్రీ శ్రీ శ్రీ గోవిందగిరి స్వాములవారు

శ్రీమద్గురుదేవులు,

కుండలిలీ జ్ఞానయోగి, అవదూత

# శ్రీశ్రీశ్రీ గోవిందగిరిస్వాముల వారి శుభాశీస్సులు

మా ప్రియ శిష్యుడు అందె వేంకటరాజము జీవితములో సాధకబాధకము లెన్నో అనుభవించి ఈ సత్కృతియైన ఈశ్వరశతకము రచించి భక్తితో మాకు సమర్పించుట సమంజసముగా, సంతోషముగా ఉన్నది.

సర్వేశ్వరుడు ఈయనకు అన్ని విధముల శ్రేయస్సులు కలుగజేయ వలెనని మా గురుదేవులను, మా ఉపాసనా దైవమగు షిర్డీసాయిబాబాను ప్రార్థించుచు శుభాశీర్వాదములు చేయుచున్నాను.

ఇట్లు
అవధూత గోవిందగిరిస్వామి

శ్రీసాయి శరణాలయాశ్రమము
మూదలపల్లి, నగరబావిరోడ్డు,
బెంగుళూరు - 560 072
తేది : 17-7-1993

# కృతిస్వామి పరిచయం

కుండలినీ జ్ఞాన యోగులు, అవధూత బ్రహ్మ శ్రీ శ్రీ శ్రీ గోవిందగిరి స్వాముల వారు సిద్ధయోగీంద్రులు. పరమ కరుణామయులు. స్వాములవారు తమిళనాడులోని ఉత్తర ఆర్కాటు జిల్లా వడమాది మంగళం గ్రామంలో శ్రీమతి మంగమ్మ, శ్రీ నెమలి గోవిందస్వామి నాయుడుగారు అనే పుణ్యదంపతుల గర్భ శుక్తిముక్తాఫలంగా తేది 29-11-1939 లో తమ అమ్మమ్మగారి ఇంటిలో జనన మందినారు. వీరిది ఆ సమీపంలోనే కల పోడూరు. ఈ గ్రామాలు ఆంధ్రప్రదేశ్ చిత్తూరు జిల్లా సరిహద్దు సమీపంలోనివి. వీరి వంశస్థులు పూర్వం ఆంధ్రులే. వ్యాపారార్థం తమిళనాడులో నివాసం ఏర్పరచుకున్నారు.

శ్రీ స్వాములవారి ఇంటిలో భక్తి జ్ఞానయుతమైన అధ్యాత్మిక వాతావరణం విలసిల్లేది. నిత్యం సాదు సంతులకు అతిథి సత్కారం జరిగేదిది. స్వాముల వారికి బాల్యంలోనే భక్తి వైరాగ్యాలు అంకురించి పెంపై ఎనిమిదవ తరగతి చదువుతున్నప్పుడే కాశీవిశ్వేశ్వరుని సందర్శించవలెననే కాంక్షతో ఇల్లు వదలి ఒక సాదువుతో బయలుదేరి కాశికి చేరి దైవ దర్శనం చేసుకొన్నారు. ఇక ఇంటికి తిరిగిపోలేదు. పరమాత్మ సందర్శన పరమాసక్తితో తపోధ్యానాలు చేసి తరించవలెనని ఆశ్రమాలు సందర్శించిరి. గంగా తీరంలో కొన్నాళ్ళు కుమార గురుపదస్వామి మఠంలో ఆశ్రయం పొంది తమ ధ్యేయసాధనకు హృషికేశ్ లోని శివానందాశ్రమం చేరి, అక్కడ చాలా కాలం యోగసాధన చేసి, సమాధి స్థితిని పొంది చరితార్థులైరి.

స్వాములవారి గురుదేవులు చిత్తూరు జిల్లాలోని కుప్పికానిపల్లి వాస్తవ్యులు శ్రీ దేవరాజానందగిరి స్వాములు. వారి అనుగ్రహంవల్ల యోగవిశేషాలు గ్రహించి తపస్సుచేసి పరిపూర్ణయోగులైరి. పిదప షిరిడి సాయిబాబాను ఆదర్శ గురువుగా ఆరాధించి, బాబా అనుగ్రహంచేత యోగరహస్యాలు అవగతమై, జిజ్ఞాసువులకు కుండలినీ జాగృతి చేసి గురువర్యులైరి. ఆ మధ్య సిద్ధులు కలిగి, మహిమలు ప్రదర్శించి, భక్తుల కోరికలు తీర్చి, కష్టాలలో ఉన్నవారి ఆపదలు, రోగాలు నివారిం

చినారు. తర్వాత గురుదేవుల ఆదేశం మేరకు మహిమలు చూపడం మానీ వేసినారు.

శ్రీ స్వాములవారు యావద్భారతదేశాన్ని, పుణ్యక్షేత్రాలను, ద్వాదశ జ్యోతిర్లింగాలను, నేపాల్ భూటాన్, టిబెట్టులోని పుణ్యక్షేత్రాలను, మానస సరోవరాన్ని దర్శించిన మహనీయులు. వారికి దేశమంతటా వేలకొలది శిష్యులున్నారు. యోగసాధనలో ప్రగతిగాంచి యోగ్యులైన వారున్నారు. స్వాములవారు ప్రస్తుతం బెంగుళూరులో శ్రీ సాయి శరణాలయం అనే ఆశ్రమాన్ని స్థాపించి ఉంటున్నారు.

శ్రీ స్వాముల వారివలె కుండలినీ జాగృతి చేసి యోగ శిక్షణ నిచ్చేవారు దేశంలో వ్రేళ్లమీద లెక్కపెట్టే సంఖ్యలోనే ఉన్నారు. అందరికీ సులభులై, కుల మత ప్రాంత భేదం లేకుండ యోగాన్ని ప్రసాదిస్తున్న పుణ్యమూర్తులు. యోగంవల్ల అనేక ప్రయోజనాలు కలవు. శరీరారోగ్యం, మనశ్శాంతి, ఏకాగ్రత, బుద్ధికుశలత, రోగనివారణ కలిగి, ఆత్మబలం పెంపొందును. నిరంతర నిష్ఠలో యోగపరిపూర్ణత్వంతో భగవత్ సాక్షాత్కారం కలుగునన్నది యోగుల అనుభవ సిద్ధవాక్యం.

మా కోరుట్లకు విచ్చేసి కొంత కాలమున్నప్పుడు శ్రీ స్వాముల వారి వద్ద 1973లో కుండలినీ జాగృతి పొంది యోగనిష్ఠ చేసితిని. తత్ ప్రభావం వల్ల అసాధారణ మేధాశక్తి వికసిల్లి అష్టావధాన విద్య సిద్ధించెను.

# విజ్ఞాపనం

ఈశ్వరశతకం నా ప్రచురిత కృతులలో ఏడవది. మహేశ్వరీ గ్రంథ మండలి చతుర్థ కుసుమంగా అందిస్తున్నాను.

ఈ శతకం నిరాకారపరబ్రహ్మను ఉద్దేశించి రచించబడినది. భక్తితో స్తుతి ప్రార్థనలు చేయబడినవి. ఇందులో భక్తి జ్ఞాన వైరాగ్య విషయాలేకాక లోకంలోని బాగోగులను, అవకతవకలను, అనాచారాలను పరమేశ్వరునికి నివేదించి సముద్ధరణకు ప్రార్థించనైనది. కొన్ని లౌకిక నీతులు సూక్తులు సముచితంగా కూర్చబడినవి.

ఈ శతకాన్ని సద్గురుదేవులు, కుండలినీ జ్ఞానయోగులు, అవధూత శ్రీశ్రీశ్రీ గోవిందగిరి స్వాములవారికి భక్తితో సమర్పించినాను. వారు దయతో స్వీకరించి శుభాశీస్సులందించినారు. వారికి కృతజ్ఞతా పూర్వక పాదాభివందనాలు.

శతకానికి 'అభినందన చందనం' రచించిన ఆత్మీయులు, సహృదయ విద్వత్కవివరేణ్యులు, పరిశోధకలలాములు, అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖాధ్యక్షులు డా॥ రావికంటి వసునందన్ గారికి, 'సాభిప్రాయం' అందించిన ఆత్మీయులు, ప్రౌఢకవీంద్రులు, పండిత శిరోమణులైన శ్రీ కవి గణపతి రామచంద్రరావుగారికి కృతజ్ఞతలు.

కృతికి ముఖచిత్రాలంకృతి కావించిన ఆత్మీయులు, ప్రముఖ చిత్రకారులు శ్రీ అలిశెట్టి మహారాజు-జగిత్యాల గారికి, చక్కని బ్లాకులు చేసియిచ్చిన మోహన్ ప్రాసెస్ వారికి, ముఖచిత్ర ముద్రణ గావించిన బాలాజి ఆర్ట్ ప్రింటర్స్ గారికి, సకాలంలో అందంగా ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీ పి. శ్రీనివాస్ గౌడుగారికి కృతజ్ఞతలు.

గ్రంథ ముద్రణకు దయతో, పరమ సహృదయతతో విరాళాలిచ్చి సాహిత్య పోషణ గావించిన పుణ్యమూర్తులగు దాతలకు కృతజ్ఞతాభివందనాలు.

ఇట్లు,
భవదీయుడు
**అందె వేంకటరాజము**

కోరుట్ల,
3-11-1993



కృతికర్త

**డా॥ అంచె వేంకటరాజము**

# ఈశ్వర శతకం

## గ్రంథముద్రణకు విరాళాలిచ్చిన దాతలు

సర్వశ్రీ

| | |
|---|---|
| రు. 516.00 | యెలిగేటి సూర్యనారాయణ సరస్వతి ప్రెస్, కోరుట్ల. |
| 216.00 | గోనె విఠలు, జ్యోతిష సమ్రాట్, కోరుట్ల. |
| 216.00 | బచ్చు గంగారాం, శ్రీనివాస్ బీడీ, కోరుట్ల. |
| 216.00 | పోతని భూమయ్య, కంట్రాక్టరు, కోరుట్ల. |
| 216.00 | వాసం శివప్రసాద్, సుధా ఫైనాన్స్ లిమిటెడ్, కోరుట్ల. |
| 116.00 | రేగుంట సాయన్న, వర్తకులు, కోరుట్ల. |
| 116.00 | గోనె రాజయ్య, బట్టల వర్తకులు, కోరుట్ల. |
| 116.00 | పొలాస సత్యనారాయణ, భాగ్యనగర్ రియల్ ఎస్టేట్స్, కోరుట్ల. |
| 116.00 | గోనె లక్ష్మణ్, గీతా సారీస్, కోరుట్ల. |
| 116.00 | గుండేటి శంకర్, శంకర్ సెలక్షన్స్, కోరుట్ల. |
| 116.00 | కీ॥ శే॥ ఉద్దంటి వెంకట నరసయ్యగారి కుమారుడు శ్యామ సుందర్; అర్చకులు, కోరుట్ల. |
| 116.00 | ఆడెపు ఆనంద్ అండ్ బ్రదర్స్, శ్రీరామ ఎంటర్ ప్రైజెస్, కోరుట్ల. |
| 51.00 | వాసాల నరేశ్, ఫోటో స్టూడియో, కోరుట్ల. |

# శోధిక

| తప్పు | ఒప్పు | పుట - పద్యం |
|---|---|---|
| దానవతతుల్ | దానవు లయో | 19 - 92 |
| వెలై | బెలై | 20 - 98 |
| వర్ధిల్లు | రాజిల్లు | 21 - 101 |

# ఈశ్వర శతకము

శ్రీమద్విశ్వవిరాట్స్వరూప! సుజనక్షేమంకరోద్యోగ! ది
వ్యామేయాప్రతిమప్రభావ! పరమేశా! సచ్చిదానందమూ
ర్తీ! మూర్తిత్రయమూలకారణలసత్తేజా! దయాబ్ధీ! పరం
ధామా! నిన్ శరణందు జన్మము కృతార్థం బౌటకై యీశ్వరా! 1

పలు జన్మంబుల నీ కృపామృతముచేఁ బండించుకొన్నట్టి పు
ణ్యాలసద్భాగ్యఫలోచ్చయం బగుచు సంప్రాప్తించె సుత్కృష్టతా
కలితంబౌ నరజన్మ, దుర్లభము దుష్కామావిలం జేక్రియన్
వెలయున్ సార్థకమౌను నీవె గతి కావే కావవే యీశ్వరా! 2

నినుఁ బూజించుచుఁ బాపకార్యములలో నిర్మగ్ను లౌవారు పా
యని దుర్వ్యాధికి మందు వాడుచు నపథ్యాహారు లౌవారు, గం
గను దాఁటన్ బెను పుట్టి యెక్కి మునుగంగా రంధ్రముల్ చేయువా
రౌనఁగూడం గల దేమి దీనికి విపద్వ్యూహంబు గా కీశ్వరా? 3

పరమాత్మా! సరిపోవు సంపదలు కూర్పన్ లేక యున్నావు, పాఁ
తఁబలే కావలె నంటినా? యతులితోద్యద్భాగ్య మిమ్మంటినా?
దురితాపాదకదారుణవ్యసనసందోహార్థినై యుంటినా?
వరసాహిత్యసమర్చనార్థ మిద లేవా యంటి నో యీశ్వరా! 4

తమి వాగీశ్వరిఁ గొల్వ నత్త యగు పద్మాదేవి కోపించు నా
యమ నాసక్తి భజింపఁ గోడలి మనం బారాటమున్ జెందు సా
మముగా నిద్దఱఁ దన్పు నిన్గొలుతు సుమ్మా! దేవదేవేశ! మూ
లము సేక మ్మొనరింపఁ గొమ్మ లవి యెల్లన్ వెల్గవే యీశ్వరా! 5

ఏ నిన్నున్ శరణంబు వేడినఁ గృపాబ్ధీ! సర్వభీతుల్ ప్రమా
దానీకంబులు పీడ లార్తులు సమస్తారిష్టముల్ వాసి యా
త్మానందంబుగ శాంతిసౌఖ్యములు శ్రేయశ్రేణు లేపారునో
యా నిన్నున్ శరణంబు వేడెదను దేవా! ప్రోవవే యీశ్వరా! 6

వేషాలంకృతి పూర్తికాక మునుపే వే రంగమున్ జేరి సం
తోషం బందుచుఁ బ్రేక్షకుల్ నగుచు నెంతో యార్వ లోపంబు ని
ర్ఘోషానం గనిపెట్టి లోపలికి పర్వుల్ పెట్టు నిర్వ్యాజ్ఞశై
లూషంబోలెఁ జరింతు లోకమున నెట్లో, ప్రోవవే యీశ్వరా! 7

పలు పోకల్ నిరతంబుఁ బోవుచు నినున్ బ్రార్థింపఁగా నేమి? ని
ర్మలమున్ నిశ్చల మైన యంబువుల బింబం బట్టు లత్యంత ని
ర్మలమున్ నిశ్చల మైన చిత్తముననే ప్రత్యక్షమౌ వాఁడ వి
మ్మల నేభంగిఁ జెలంగు నాదశ దయన్ బోధింపవే యీశ్వరా! 8

దేనిన్ బొందిన నన్ని బొందఁగఁ బడున్ దివ్యంబు భవ్యంబుగా
దేనిన్ గన్గొన నన్ని కన్గొనఁ బడున్ దెల్లంబు మొల్లంబుగా
దానిన్ నీ పరతత్త్వమున్ గనఁగ నుద్దామంబు నేమంబుగాఁ
బూనంగాఁ దగు దీక్ష యెయ్యదియొ పొల్పుం దెల్పవే యీశ్వరా! 9

కలకాలంబు వసింపఁ బోరు జగతిన్ గాయంబు ఖాయంబుగా
దిలువాకిం డ్లితరోరుసంపదలు నెన్నే నుండునే యెప్పుడున్
గలహా లేటికిఁ గష్ట లెందులకుఁ బోఁగాఁ బూరియున్ వచ్చునే
చెలిమిన్ నీ కలిమిన్ వహించి శుభముల్ చేపట్టరో యీశ్వరా! 10

తటముల్ కానఁగ రాని సంసృతిసముద్రం బిందు నాల్బడ్డ లె
చ్చటివారో యెట కేగువారొ నడుమన్ సంప్రాప్తమైనారు ముం
దటి భోగంబు లెఱుంగరావు కన నంతా భ్రాంతి మూన్నాళ్ళము
చ్చట కీ నిక్కులు పెక్కు లేల దరి జేర్చ న్నీవె యో యీశ్వరా! 11

నవమాసంబులు మోయుఁ దల్లి యటువైనన్ జీవితాంతంబు దా
నవసారంబులు చేఁపి యన్నిటికి విన్నాణంబుగా నోపి సౌ
ఖ్యవితానంబుల మోయు ధాత్రి, తగు సేవాసక్తి నీ తల్లికే
యవమానంబును దేక భారమునుగా కర్పింతుఁగా కీశ్వరా! 12

వేదాలే యిదమిత్థ మంచుఁ బలుకన్ వెన్నాఁడు, శాస్త్రాల బల్
వాదాలే యొక తీర్పు నొప్పవు బృహద్వ్యాఖ్యన్, బురాణాల పల్
భేదాలే నిను జెప్పఁ బోవుచు మహావిభ్రాంతిలో ముంచు నీ
పాదాలే గతి మూఢచిత్తుఁడ నెటుల్ వర్ణింతునో యీశ్వరా! 13

మైకుల్ వచ్చెను భక్తియున్ భజనలున్ బాజారు పాలయ్యెఁ బూ
జాకార్యంబు నటప్రదర్శనము గాసాగెన్ త్వదారాధనో
త్సేకం బెంతయు యాంత్రికం బగుచు వర్తిల్లెన్ భవన్మందిరా
నీకంబుల్ కుజనాశ్యధీనములు బందెన్ మ్రందెదో యీశ్వరా! 14

హరి యన్నన్ హరుఁ డన్న నర్థమున రవ్వంతైన భేదంబులే
దరయన్ భేదము జూపు వారకట! వ్యర్థానర్థముల్ రేఁపువా
రిరుగన్నుల్ పెర లంచు గ్రువ్వ గతి యున్నె అచ్చు వేత్రైన బం
గరు సొమ్ముల్ పరవస్తుజన్యములె కంగా రేలొకో యీశ్వరా! 15

కన్నుల్ విప్పిన నొండు రెండె యెదుటన్ గన్పట్టు ధ్యానార్థమై
కన్నుల్ మూసిన యంత సర్వజగముల్ గాన్పించు సామాన్యవే
ళ న్నిల్వం బడు మానసంబు నిను గొల్వం బట్టఁగా నిల్వ కె
న్నెన్నో దిక్కులఁ బాఱుఁ గళ్ళె మెటులో హృద్వాజి కోయీశ్వరా! 16

భక్తిన్ నిన్ క్షణ మైన నెమ్మనమునన్ భావించి సేవించినన్
ముక్తిన్ గాంచుట యేమసంభవము? పెంపున్ గాంచు శ్రద్ధన్ మహా
సక్తిన్ నాటిన గింజ కాలగతి వృక్షంబై ఫలం బీయదే
రక్తిన్ జొప్పడు నీ దయామృతపు వర్షం బున్నచో నీశ్వరా! 17

నిన్నాత్మన్ నెఱ నమ్మినందులకు దండ్రీ! యెట్టి మోసంబు నా
కెన్నండే నగునే? విపత్తు దరి రా నిచ్చించునే? దైన్యమున్
బన్నంబున్ స్పృశియించునే? వెతలు ప్రాప్తంబౌనె? నైరాశ్యసం
ఛన్నంబౌనె మనమ్ము? నెమ్మది కదే శ్వశ్రేయసం బీశ్వరా! 18

సత్యంబున్ బ్రియమున్ హితంబు మితమున్ సౌమ్యంబునౌ మాటయే
నిత్యంబున్ వచియించు వర్తన మనన్ నిస్త్రింశధారావ్రతం
బత్యంతంబు శివంబు సుందరము నీ యాత్మస్వరూపం బెటుల్
ప్రత్యాసన్న మగున్ బరాత్పర! దయన్ బాటింపవే యీశ్వరా! 19

పొరపాటో గ్రహచారమో యొకడు తప్పుం జేసి దుఃఖింపఁగా
నరులా మానిసి చిత్తశల్యమయి నిందల్ మాటికిన్ జేతు రే
వరపుణ్యంబును మూట గట్టెదరొ యెవ్వారైన నిర్దోషులై
ధర నున్నారొ క్షమాగుణం బొలయుఁ గాతన్ వారి కో యీశ్వరా!

వణిజుం డంగడి దీసి నిత్యము నినున్ బ్రార్థించి యాపై నదే
పనిగా జేరము లందు మోస మొనరింపన్ సాగి పాపావళుల్
ధనరాశుల్ గడు గూర్చి మ్రొక్కుబడు లందంజేసి నీ పేరు ని
ల్వన ముంచున్ బహువృత్తు లిట్టివె యెటు ల్బొక్కంబులో నీశ్వరా!

అమితాశ్చర్యముఁ గొల్పు వ్యోమఘటికాయంత్రంబునన్ సూర్యచం
ద్రములన్ ముండ్ల నమర్చి కచ్చితపుఁగాలంబున్ సదా తెల్పు చం
దమరంగా ఋతుచక్రమున్ నిలిపి ప్రత్యగ్రప్రకృత్యంగనా
రమణీయోరువిలాసముల్ నెఱపె దౌరా! కౌశలం బీశ్వరా! 22

ప్రణయోపేతము గాక వర్తిలెడు దాంపత్యంబు, విశ్వాసభా
జనుఁడై కొల్వని బంటు, నాపదలలో సాయంబుగా రాని మి
త్రుని, నీతిం గనలేని నాయకుని, ఛాత్రున్ దిద్దు నాదర్శ మొ
ప్పని యొజ్జన్, మది లేని పూజను భరింపన్ శక్యమే యీశ్వరా! 23

నరులే దేవుని సృష్టి చేసి రని నానాపీడ లన్యాయముల్
తరచౌనే మరి దేవుఁ డున్న నని విద్యావంతులౌ పెద్దలే
పరిహాసం బొనరించి భౌతికసుఖాపారాంబుధిన్ మున్గువా
రరరే! గడ్డకుఁ జేర్చువా రెవరు రాయై యుండ నీ వీశ్వరా! 24

పరమస్వార్థపరీతచిత్తు లగు దుస్స్వాముల్, మహాపాపకా
ర్యరతుల్ దాంభికు లైన భక్తులు నితాంతాపత్రపథ స్నీకుఁ దె
చ్చిరి, యాస్తిక్యమునన్ జుగుప్స కడు హెచ్చెన్, ధర్మవిధ్వంసమే
పరమంబౌ జడవాదముల్ ప్రబలె నెవ్వా రింకఁ బ్రాపీశ్వరా? 25

అతిసూక్ష్మంబు నమేయమున్ దురవగాహం బైన నీ తత్త్వమున్
మతిఁ జింతింపఁగ లేక లోకులు మహామాయావృతభ్రాంతి శా
శ్వతునిన్ గల్ల యటంచు ద్రోచి మృషలౌ సంసారసౌఖ్యంబులే
సత మంచున్ రమియింత్రు స్వప్నసుఖముల్ సత్యంబులే యీశ్వరా!

పరమేశా! కరుణామయా! సుగుణసంపద్భోగభాగ్యాదులన్
వరదా! యీయవె యంచుఁ గేవలము నిన్ బ్రార్థించి కార్యాంచితా
చరణం బేమి యొనర్ప కున్న ఫలమే? సంద్రంబు దాఁటింప మేల్
తరణిం బట్టక యానభద్రత కెడంద న్వేడ నేమీశ్వరా! 27

భళిరా! తోయములందు బెండ్ల పగిదిన్ బ్రహ్మాండముల్ లెక్కకా
వలయై తేలు చనంతరోదసిఁ బరిభ్రాంతంబు లౌచుండు నే
కలనన్ దప్ప వొకప్పుడున్ గతులు నీ కార్యంబులే యిట్టు లూ
హలకున్ మించినఁ గర్త నెన్నుటకు శక్యం బౌనె నిన్నీశ్వరా! 28

మా శాస్త్రజ్ఞులు కొన్ని యంత్రములు నిర్మాణంబు గావించి నై
జాశక్తిన్ గడు విఱ్ఱవీఁగుదురు దేవా! నీ వజాండంబులన్
రాశుల్ వోసిన యీ చరాచరపదార్థంబుల్ విచిత్రంబులై
లేశం బర్థమె గావటన్న నిఁక వేఱే పల్కు బెట్టీశ్వరా? 29

ఘనపంచేంద్రియపశ్యతోహపల మూఁకన్ దేహసౌధాంతరం
బునఁ గాపుంచి యమూల్యచిత్తనిధి నింపుల్ మీఱఁ దన్మధ్యమం
దున భద్రం బని దాఁచి చూచెద వయో! దోఁచంగ నేఁచంగ; న
మ్మినవారిన్ గికురింప నౌనె కరుణన్ మేల్గార్పవే యీశ్వరా! 30

యోగజ్ఞానవ్రతాదికర్మతతికే నోర్వంగ లేనెంతయున్
రాగద్వేషము లంటి పీడవు మదిన్ గ్రందయ్యె సంతాపముల్
బాగోగుల్ సరిగా నెఱుంగను భవత్పాదాబ్జముల్ నమ్మితిన్
యోగక్షేమములన్ వహించి దయతో నోమంగదే యీశ్వరా! 31

ఆహారాదికదేహకృత్యము లమూల్యంబైన కాలంబు న
య్యో! హెచ్చై కడు వెచ్చఁబెట్టు రహి దా నుండంగఁ బ్రాయంబు తా
వాహిన్యల్పఋతుల్యమై యెగసి నిల్వన్ లేక పోసాగు సం
దేహంబొఁ బురుషార్థ సాధనకు లేదే యోగమో యీశ్వరా? 32

ఆపత్కాలములం దలంచుటకు నార్తాలాప మాలించి పెన్
బ్రాపై కాచుట కీవు మాకుఁ గల వెవ్వా రుర్వి నున్నారు స్వా
మీ! పాలింపఁగ నాస్తికావళికి? తామే సర్వమన్ గర్వమే
తాపంబుల్ గలిగించుఁ బూర్ణులె నరుల్ తా మెంతవా రీశ్వరా! 33

తడబాటౌ నెడ ధైర్యమున్ గొలుపుచున్ దైన్యాంధకూపంబునన్
బడఁ గేలూఁత సముద్ధరించుచు నహంభావోరుశైలాగ్ర మె
క్కెడ నెక్కన్ దిగ లాగుచున్ఁ దెగి నికృష్టేర్ష్యాదివైరుల్ పయిం
బడఁ జెండాడుచుఁ బ్రోవవే శ్రితజనవ్రాతావనా! యీశ్వరా! 34

చదువుల్ నేర్చిన దానికిన్ దగిన సంస్కారంబు తోరంపు సం
పద లేపారిన దానికిన్ దగిన ధర్మత్యాగముల్ సీపయిన్
గుదురై వర్తిలు భక్తికిన్ దగిన సాద్గుణ్యంబు లెవ్వారిలోఁ
బొదలున్ వారికిఁ గేలు మోడ్తు నెడఁదల్ పొంగారఁగా నీశ్వరా! 35

దైవంబున్ వికృతిం బొనర్చి పలుకన్ దయ్యంబుగా మారి తా
గ్రోవం జాలక పట్టి పీడలొసఁగున్ బూజారిలో నక్షరో
జ్జీవద్భావ మనర్థమందు బడఁగాఁ జెటొందు పూజారియా
భావంబే యగు మేలుఁగీళ్ళకు మొదల్ భావింపఁగా నీశ్వరా! 36

జీవింపన్ దలిదండ్రులన్ నెనరుతో సేవింపఁగా లేక యా
జీవుల్ పోయిన పిమ్మటన్ జెలఁగు నుత్సేకమ్ముతో శ్రాద్ధముల్
గావింపన్ సమకట్టు రీతి నతినిర్భాగ్యార్తదీనప్రజన్
సేవింపన్ మతి లేక రాళులను బూజింపంగ నే మీశ్వరా! 37

అలసత్వంబున కంతు లేదెపుడు శుష్కాలాపముల్ ప్రజ్ఞలున్
బలుకన్ సిబ్బితి లేదు పౌరుషముఁ జేవన్ మూలకుం ద్రొక్కి తే
పలదైవమ్మును నమ్మినారు కుమతుల్ స్వార్థుల్ నికృష్టుల్ నిరీ
హులు జాతీయులు దేశ మెన్నటికి నెట్లుద్ధారమౌ నీశ్వరా? 38

పలు కష్టంబుల కోర్చి యుజ్జ్వలదశాప్రాప్తుం డొకండైన లో
కులు వానిన్ వినుతింపఁ గొందఱకు దృక్కుల్ మండి వాపోదురే,
జలజాప్తుం డుదయింప మేల్కొని సమస్తప్రాణులున్ గెల్పుమైఁ
జెలఁగన్ గూబలు చూడలేక కడుఁ గస్తిం గూయవే యీశ్వరా! 39

రాపం బంచున గజ్జి గోఁకు కొలఁదిన్ గాయంబు లౌచుండియున్
హాయిన్ గొల్పుచు పిమ్మటన్ మిగుల హాహాకారముల్ రేఁపున
ట్లాయా సౌఖ్యములన్ రమించు కొలఁదిన్ హాయిన్ బ్రసాదించి యా
హాయిన్ స్థాయిని గూల్చి గోడు గుడుపున్ వ్యామోహమే యీశ్వరా? 40

విద్యుత్తంత్రుల నెందుఁ గన్పడక తద్విద్యుత్ప్రవాహంబు తా
నాద్యంతంబు నెసంగి 'బెస్టరున' నెందైనన్ స్ఫుటంబౌ గతిన్
విద్యోతుండవు గాక యింద్రియతతిన్ విశ్వంబునం దెల్లెడన్
సద్యఃప్రస్ఫుట మౌదు భక్తిజనితజ్ఞానంబుచే నీశ్వరా! 41

సాగున్ పంతులుగారి జీవితగతుల్ ఛాత్రాళి యున్నప్పుడే
వేగున్ నీ బ్రదు కెల్ల భక్తవితతుల్ వెయ్యేలు లున్నప్పుడే
వేగన్ లేరని పల్కుచున్ గడుసరుల్ వీఁకన్ విజృంభింతు రే
బాగైనన్ విపరీతబుద్ధులకుఁ బ్రాప్తంబౌనె యోయీశ్వరా? 42

పాపా లెన్నొనరించినన్ నరుఁడు తెంపల్ వేసికొం చొక్కమా
'ఆపద్బాంధవ!' యంచు నిన్ దలఁచుకొన్నంతన్ వెసన్ మోక్షమున్
బ్రాపించున్ నిజ మంచుఁ జెప్పు కథలన్ బాటింపరా దైనచోఁ
దాపా లేటికి ముక్తి వీధి దొరకన్ ధర్మాని కోయీశ్వరా! 43

పొడుమో చుట్టయొ యిచ్చువాని కెద యుప్పొంగగన్ గృతజ్ఞుం డగున్
కడుఁ గీర్తించుచు మానవుండు, వరమౌ కాయంబుతో నీభువిన్
పొడమన్ జేసి సమస్త సౌఖ్యముల నింపుల్ నింపినన్ దాను నీ
యెడ రవ్వంతయుఁ జూపఁడే నెనరు తండ్రీ! మూఢుఁడై యీశ్వరా!

అపరాధం బొకనాఁడుఁ జేయని జనుం డచ్చంపు దైవంబు, తా
నపరాధం బొనరించి తాపపడి శుద్ధాత్ముండుగాన్ మానవుం
డపరాధంబులు జంకు లేకెపుడు చేయన్ సాగినన్ దానవుం
డుపమింపన్ నగు నిన్ని చందములఁ జేయున్ వర్తనం బీశ్వరా! 45

భవదవ్యాజదయామృతమ్ము తఱచై బాగొప్ప మన్మానసో
ద్భవసద్వాంఛల కార్యసిద్ధి యగుచున్ భద్రావళుల్ పైకొనన్
భువి నెల్లన్ దివిఁ జేయు ధర్మనిరతిన్ బొందించి నీమీఁది భ
క్తివిచారంబులు సతతంబు మదిలోఁ గీల్కొల్పవే యీశ్వరా! 46

బ్రతు కెల్లన్ మడిగట్టి శీల మనుచున్ భక్తిన్ విడంబించుచున్
క్షితిలో నన్యులఁ జూచి రోయుచు నధిక్షేపించు నశ్రాంతమున్
మతిమంతుం డొకఁ డాత్మమందిరమునన్ మాలిన్యముల్ నిండ నే
గతి నీవందు వసింతు వేకరణిఁ దాఁ గాంచున్ శివం బీశ్వరా! 47

గుణముల్ వీడి యొకండు దోషములనే కోర్కిన్ గవేషించి యొ
క్కని నిందించుచుఁ దత్త్రియన్ మిగుల వేడ్కన్ బొంగుచున్ దూలు నె
ట్లనినన్ దేహమునన్ సుగంధయుతరమ్యాంగంబు లుండంగ మె
చ్చనిదై మక్షిక క్రుళ్ళుఁబుండ్ల పయి నిచ్చల్ వ్రాలదే యీశ్వరా! 48

ఏనే శుద్ధుఁడ నంచు నన్యుల నసహ్యింపంగ నెన్నేనియున్
స్నానార్చాదులనేమి? భాండము పయిన్ సంశుద్ధి గావించియున్
లోనన్ జేయక వండు వంటకము మేలున్ గూర్ప లేనట్టి చం
దానన్ తద్ర్వత మెల్ల నిష్ఫలమె యంతశ్శుద్ధి లేకీశ్వరా! 49

మోమున్ దర్పణ మందు నిత్యము కడున్ ముద్దారఁగా దిద్ది ది
వ్యామోదంబులఁ దీర్చు చందమున దేవా! శుద్ధచిత్తంబునన్
నేమం బొప్ప భవద్గుణాదినుతులన్ నిత్యంబుఁ గై సేయుచున్
దా మాత్మన్ విలసిల్లఁ జేయు నరులే ధన్యాత్ములో యీశ్వరా! 50

ఏ యాలోచన లుద్భవింపఁగ మనం జేపాడునో గర్విమై
నే యుక్తుల్ వచియింప మే లెసఁగి యెంతే ధన్యతన్ గూర్చునో
యే యాచారములన్ రహింప శుభముల్ హేరాళమై పొల్చునో
యా యొప్పుల్ వెలయించి సంతతము ప్రాపై మన్పవే యీశ్వరా! 51

అన్యాయార్జితవిత్తముల్ ముడిచి సౌఖ్యంబుల్ మహాభోగముల్
మాన్యోదాత్తపదోరువైభవములున్ బ్రాపించి శోభిల్లు కం
టెన్ యుక్తంబగు గంజియో కలియొ పాడిన్ ద్రావ మే లంతకున్
దైన్యం బైనను వీధి భిక్ష మడుగన్ బాగెంతొయా నీశ్వరా! 52

మత మేదైన భవత్పదంబు గను సన్మార్గంబె యైనప్పు డం
చితబుద్ధిన్ నిజధర్మకర్మసరణిన్ జేతంబు పూతంబుగా
నుతులన్ వెన్నతులన్ నినున్ గొలువ కెన్నో కుట్రలం బన్ని దు
ర్మతులై స్వీయమతాంబుధిన్ బరుల ముంపన్ శ్రేయమే యీశ్వరా!

కరవాలంబును దూసి యొక్కఁడు మహాకౌటిల్య మేపారఁగా
నెరగాలంబును వేసి యొక్కఁ డయయో యీ ధాత్రి ఘోరంబుగా
నరులన్ భ్రష్టులఁ జేసి స్వీయమతముల్ బట్టింతు రాస్తిక్యమీ
కరణిన్ వేసెను వెఱ్ఱివేషములు సద్గత్యాప్తికే యీశ్వరా! 54

సుమహాలీనసమాజ మెల్లయెడలన్ సంక్షోభము జెంది స
ర్వము దుష్టంబును నష్ట మయ్యె ననుచున్ వాపోయి తామందు భ్ర
ష్టము గానేటికి వ్యక్తి నిల్పుకొను చేష్టల్ కూడవే? పెన్ ప్రవా
హము తీవ్రం బగుచోఁ బదంబు పదిలంబై దాఁటరే యీశ్వరా! 55

వ్యాయామంబున దేహమున్ జదువులన్ ప్రజ్ఞానమున్ సద్గుణ
స్థానమున్ శీలము నిర్జితేంద్రియతఁ జిత్తంబున్ శ్రమాంభస్స్నాత
న్యాయోపార్జన విత్తమున్ హితమితాహారాదులన్ స్వాస్థ్యమున్
శ్రేయోభక్తిని జన్మ జేయఁ గదె యుత్కృష్టంబుగా నీశ్వరా! 56

చెడుగో మంచియొ యొక్కఁ డొక్కయెడఁ దాఁ జేయన్ జనుల్ వాని నె
ల్లెడఁ దచ్ఛీలమె గల్గువాఁ డనుచు నెంతే నాత్మ భావించి హె
చ్చెడు పైత్యమ్మున రెచ్చి ప్రేలెదరు, సచ్ఛీలంబొ దుశ్శీలమో
యడిగొట్టై యవిమృశ్యకారి యగువాఁ డౌనో నరుం డీశ్వరా! 57

నీవే తల్లివి తండ్రి వీవె చెలి వీవే యాత్మబంధుండవున్
నీవే విద్యవు నీవె విత్తమవు నీవే సర్వమున్ నాకు నో
దేవా! నీ కితరంబు విశ్వమున నెందే నెద్దియే నున్నదే
కైవల్యాత్మక! యోపరాత్పర! ననున్ గాపాడవే యీశ్వరా! 58

భువిలో నంగబలంబొ యర్థబలమో పొల్పొంద నత్యంతవై
భవదీప్తిన్ వెలుఁగొందువారిఁ గొలువన్ బాటింతురే గాని యె
క్కువ విద్యాబల మున్నవారిఁ దలఁపన్ గోరంగ లేరీ జనుల్
శివునిన్ గేశవు గాక బ్రహ్మ నెవరేఁ జింతింతురే యీశ్వరా! 59

కరదీపంబున నించుకించుక మహాగాఢాంధకారంబునన్
సరణిన్ గాంచుచు సాగిపోవు కరణిన్ స్వల్పస్ఫురత్ప్రజ్ఞచే
నరుఁ డావంత యెఱుంగుచున్ నిరతమున్ గర్వాంధుడై సర్వమున్
సరిగాఁ గాంచితి నంచు నిక్కును బరిజ్ఞానం బహో! యీశ్వరా! 60

ఒక పుణ్యాత్ముని వేఁడికొన్న నతఁ డయ్యో పాప మంచున్ దయా
త్మకుఁడై సాయ మొనర్చు శక్తి కొలఁదిన్ ధాత్రిన్ విపత్సాగరో
ర్మికలన్ మున్గుచు నెంత కూయిడినఁ దండ్రీ! కావ వేమయ్య? యో
సకలాజాండవిభూ! యనాథజనరక్షా! మన్పవే యీశ్వరా! 61

రసనాగ్రంబున వాణి నర్తన మొనర్పన్ బ్రహ్మవై యీ జగ
ద్విసరంబున్ సృజియించి, లక్ష్మి యెదలో వెల్గొంద విష్ణుండవై
పొసఁగన్ బ్రోచి, యమేయశక్తి మెయిలోఁ బొల్పార రుద్రుండవై
కసి దీఱన్ బ్రళయం బొనర్చెదవొ, ఓంకారాత్మకా! యీశ్వరా! 62

కోటుల్ రాసులు పోసినన్ గళమునన్ గ్రూరాసులన్ గ్రుమ్మినన్
ఆటుల్ పోటులు నెన్ని గ్రమ్మినను ధర్మాచారనిష్ఠారతిన్
బాటిన్ దప్పని నాయకోత్తము లిలన్ బాలింత్రుగా కెన్నడే
పూటన్ దప్పునె సూర్యచంద్రగతు లా పొల్పొప్పదే యీశ్వరా! 63

నరజన్మంబు కృతార్థ మౌటకు పరంధామా! నినున్ జేర స
ద్గురుకారుణ్యము చేతఁ గుండలిని మేల్కొఁజేసి నేమంబుగా
స్థిరచిత్తంబున నిష్ఠ చేసి కర మర్థిన్ రాజయోగంబునన్
పరమార్థంబు విహంగమార్గమున గూర్పన్ యుక్త మో యీశ్వరా!

చిరకాలంబు భవత్పదాంబుజములన్ సేవించి సద్భక్తిచే,
వరమేధన్ బహుశాస్త్రముల్ దఱచి దివ్యజ్ఞానతేజంబుచే,
గురుదీక్షన్ సవనవ్రతాదిక్రియలన్ ఘూర్ణిల్లు దార్ఢ్యండఁగా
పరమౌ సత్వర రాజయోగము నినున్ బ్రాపించఁగా నీశ్వరా! 65

హంకారంబున కందకుండు విమలంబౌ నాత్మవిశ్వాసమున్
జంకౌ దైన్యము నందుఁ గూల్చని ప్రశస్తంబైన నమ్రత్వమున్
శంకాపంకము తాఁకనట్టి విమలజ్ఞానంబునున్ చిత్తమే
వంకన్ బోవని నీదు భక్తి సతమున్ బ్రాప్తించుగా కీశ్వరా! 66

మహనీయుల్ జనియించి రెప్పుడున్ సన్మార్గంబులన్ జూపుచున్
సహకారంబు లొనర్చి రెల్లెడల విస్తారానుభూతిన్ గుణ
గ్రహణం బయ్యె నదేమి కర్మమొకొ? యేకాలంబునున్ బాగుకా
దిహలోకంబును బాగొనర్చు జను లేరీ నీవుగా కీశ్వరా! 67

గీతల్ వ్రాఁతలు నిత్యమున్ జదివి నిన్ గీర్తింపఁగా నేమి మేల్
చేఁతల్ చేయక, భార్య భర్తను దగన్ సేవించి శీలమ్ముతోఁ
జేతోమోదముగా నొనర్పక కడున్ సింగారముల్ గూర్చుచున్
నీతుల్ పల్కుచు స్తోత్రపాఠములు సంధింపంగనే మీశ్వరా! 68

తనలో సుస్థిరమై విరాజిలెడు నిన్ దాఁ గాంచఁగా లేక భ్రాం
తిని బైటన్ భువనత్రయిన్ మిగుల నన్వేషించి వేసారు, శా
స్త్రనిరూప్యమ్ముగ నీవు విశ్వమయతన్ రాజిల్లఁగా నాత్మయం
దునఁ గొల్వై తనరారు నిన్ను గను టెంతో సౌఖ్య మో యీశ్వరా!

ఈవే బ్రహ్మవు నీవె విష్ణుఁడవు నీవే దేవ! శంభుండవున్
నీవే వాణివి నీవె ఇందిరవు నీవే శాంభవీమాతవున్
నీవే దివ్యగుణస్వభావక్రియలన్ దేవాధిదేవుండవై
భావింపన్ బహునామరూపములతో భ్రాజిల్లె దో యీశ్వరా! 70

ఎన్నో విద్యలు శాస్త్రముల్ చదువఁగా నెన్నో మహాకార్యముల్
విన్నాణంబుగఁ జేయఁగా నిరత ముద్వేలంబుగాఁ గాంక్ష లు
త్పన్నంబౌ మరి శక్తిలేదు నెరవేర్పన్ క్షుత్తు మిన్నంత నో
రన్నన్ సూచిక బెజ్జ మంతఁ జరితార్థం బెట్టులౌ నీశ్వరా! 71

అల్పంబైన వెతల్ పయింపడ మనం బశ్వత్థపత్రక్రియన్
నిల్పోపన్ దిటవేది తల్లడిలుఁ దండ్రీ! కష్టముల్ రాని మేల్
కల్పించన్ వలెఁ గష్టముల్ కలుగ వీఁకన్ వాని నిర్జించు గుం
డె ల్పెంపొందఁగఁ జేయవే కరుణ పాటిల్లంగ నోయీశ్వరా! 72

అవివేకంబున నిన్ను నే మఱచి యన్యాధ్వంబునం దెన్నఁ దే
ని వెతల్ వొందిన విస్మరించక దయన్ నీవెప్పుడున్ బ్రోవవే
భువిలోనన్ బసివాఁ డెఱుంగక యెదే భూరిప్రమాదంబునన్
దవులన్ దల్లి గ్రహించి కావదె మమత్వస్ఫీతయై యీశ్వరా! 73

ఆపత్సంపదనీకభంగము లమేయక్లేశముల్ గూర్చినన్
లేపన్ దుష్టతిమింగలంబు లెదురై జృంభించినన్ విఘ్నముల్
మోపై మాటికి నిల్చిపోవ జగదంభోరాశి భద్రంబుగా
ప్రాపై జీవితనౌకఁ దీరమును జేరం జేయవే యీశ్వరా! 74

అందె వేంకటరాజము

ఆలోచింపఁగ నెవ్వరీ ధరణిలో నస్పృశ్యు లేరీతిగన్?
మాలల్ కారు గుణోత్తమత్వమున, దుర్మాలిన్య చిత్తద్విజా
వళినే నంటఁగ రామ, నీసుతులు సర్వ మ్మొక్కటే యైనచో
నేలా మాయని మచ్చ మానవతకౌ నీదుర్గుణం బీశ్వరా! 75

పులి క్రౌర్యంబున నక్క మోసమున గుంపుల్ గూడుచున్ రేఁగు రేఁ
చులు పశుత్వమునన్ గపుల్ చపలతన్ జోరైన పేరొందఁగా
ఖలుడౌ మానిసి యిన్ని దుర్గుణములన్ గాంచెన్ మహాప్రజ్ఞ విం
తలితో వింతగ నర్థమౌనె ప్రభు! నీధాతృత్వ మోయీశ్వరా! 76

ఆద్యంతంబులు లేని కాలము నమేయానంతవిశ్వంబు బల్
చోద్యంబౌ నరు లెంత కాల మెచటన్ శోభిల్లఁగా సాధ్యమౌ
మాద్యద్బుద్ధుల శక్తులున్ స్థితిగతుల్ మాత్రంబు లేపాటి ఛీ!
సద్యోజాతగతాల్పబుద్బుదము లీజన్మమ్ము లే మీశ్వరా! 77

ఘటసందోహ జలంబులెన్నిటను సిక్తంబౌను ధాత్రీతలం
బెటులన్ దీపములెన్ని పెట్టిన జగంబెల్లన్ బ్రకాశించు ను
ద్భట యంత్రంబుల నెన్నమర్చిన మెయిన్ బ్రాణంబు లాడున్ భవత్
పటుసామర్థ్య మజేయ మవ్యయము విశ్వవ్యాప్తమో యీశ్వరా! 78

నిరతంబున్ భవదంఘ్రిపద్మములు ధ్యానింపంగ సద్భావనా
పరతన్ నిత్యము ధర్మకర్మములు సల్పంగన్ సదాచారసం
సరణిన్ వీడక సాగిపోవఁగను నా జన్మంబు ధన్యత్వమున్
బొరయంగా వర మిచ్చి నన్ గరుణతోఁ బ్రోవంగదే యీశ్వరా! 79

తప్పుల్ చేసెద బుద్ధి తక్కువచు నా తండ్రీ! క్షమాంభోధివై
తప్పుల్ దిద్దుచు సక్రమాధ్వమున నిత్యంబున్ జనం జేయవే
యొప్పై మెప్పగు వర్తనంబులకు నా కుత్సాహమున్ శక్తియున్
చొప్పున్ గూర్చి కరావలంబ మిడవే చొక్కంబుగా నీశ్వరా! 80

ఆలన్ బాగుగ మేపినన్ బలిసి దివ్యక్షీరధారావళిన్
మేలౌ క్షేత్రవృషాళి నిచ్చు క్రియ స్వామీ! మమ్ము సౌఖ్యంబులన్
శ్రీలన్ బ్రోచిన నిన్ను సౌష్ఠవమహోత్సేకంబుగాఁ గొల్తు మీ
లీలన్ మాకును నీకు లాభ మగుఁ దండ్రీ! చూడవే యీశ్వరా! 81

నరహృన్మందిర మందు సత్కరుణ జ్ఞానజ్యోతి వెల్గించి సా
దరబోధామృతభక్తియోగపథముల్ దర్శింపఁగాఁ జేసి నీ
పరతత్త్వంబు లభింప జన్మము తరింపన్ జేయు పుణ్యాత్మ స
ద్గురుదేవున్ శరణమ్ము పొంది నుతియింతున్ భక్తితో నీశ్వరా! 82

క్షణికం బైన సుఖంబులున్ వివిధకాంక్షల్ దీర నీ యర్చనల్
జనముల్ చేతురు గాని యాత్మబలమున్ సన్మార్గమున్ మోక్షమున్
గను వాంఛన్ నిను గొల్వ రచ్చ మగు సత్కార్యమ్ములన్ సల్పరే
మననౌ భక్తిని జీవితమ్ము లెటు ధన్యంబౌనో యో యీశ్వరా! 83

దినమున్ దేహ మలంకరించుకొని మందీభూతదివ్యాత్ములై
ఘనయంబున్ సుతదారబాంధవసుహృద్వ్యామోహితస్వాంతులై
ఘనరాగంబున నన్నపానశయనాగ్రప్రీతులై జన్మముల్
చనఁగాఁ జూతురు కాని ధన్యచరితుల్ గానేర రోయీశ్వరా! 84

పశుపక్షిక్రిమికీటకాదుల వలెన్ వ్యర్థంబుగా భోగులై
యశనాదిక్రియలన్ లయించుటకుగా దయ్యయ్యో! యీ జన్మ స
ద్వశమై సత్పురుషార్థసాధనలలో ధన్యత్వమున్ జెంది స
ద్యశమున్ మోక్షము గాంచుటే ఫలము గమ్యం బద్దియే యీశ్వరా! 85

లోభుల్ వ్యర్థ లనంతసంపదలు కల్లోలంబుగా వచ్చినన్
లాభం బేమిటి చెత్తయున్ దినరు మేనన్ వచ్చు మన్నైన నెం
దే భిక్షం బిడ రాలితోఁ గలియ 'రిస్సీ! పుట్టు పుత్రుండు మెం
డై భాగ్యంబు హరించునో యనుచు దేవా! ఘోరమో యీశ్వరా! 86

అవనిన్ మానిసి పక్షపాతి యయి న్యాయం బేమి కావించుఁ బా
వపు పొసంగము గల్గు త్రాసు బరు వేదైనన్ దగన్ దూఁచునే
యవివేకంబున దొంగ వ్రాఁతలకు విద్యార్థుల్ తరింపంగలే
రవురా! రంధ్రఘటంబులో నెటులఁ దోయం బుండునో యీశ్వరా! 87

కుల మేమీ గుణమే ప్రధాన మని మున్ ఘోషింపరే శంకరా
ర్యులు రామానుజులున్ బసప్పప్రభువున్ యోగీశులున్ బుద్ధుఁడున్
బొలుపై గాంధియు నెంద రెన్ని గతులన్ బోధించినన్ బుద్ధి రా
దెలమిన్ మర్త్యుల సత్ప్రవర్తనకు నింకేదీ పథం బీశ్వరా! 88

పద మందున్ బద మందు మార్గమునఁ బెన్ పల్లేరులే గ్రుచ్చినన్
రద మందున్ రద మందు భోజనమునన్ రాల్ వచ్చి బాధించినన్
బ్రదు కెల్లన్ గడగండ్ల ముండ్లఁబొరలింపన్ సాగునే రీతి నె
మ్మదిగా సౌఖ్యము శాంతి నిచ్చి దయతో మన్పంగదే యీశ్వరా! 89

బాధల్ కీర్తి ధనాశఁ గూర్చఁ దమితో బాబాల దర్శింత్రు స
ద్బోధల్ గాంచి తపించి శ్రేయములతోఁ బొల్పొందఁగాఁ జూడ రే
వేధల్ పొందక యల్పబుద్ధు లగుచున్ భిక్షాటనల్ జేయు త
ద్గాథల్ గాక శ్రమించు పౌరుషమె సత్రాప్తంబె యోయీశ్వరా! 90

అచలబ్రహ్మము నిన్నుఁ బట్టుకొని ధైర్యస్థైర్యముల్ వెల్గి శ్లా
ఘ్యచిరాయుస్సును గాంచి వర్ధిలెను మార్కండేయుఁ డానాఁడు సం
ప్రచలంబున్ క్షణికంబునౌ పదవులన్ మా నాయకుల్ పట్టి సం
కుచితార్థస్థితి వీడిపోయెదరు సంక్షోభంబుతో నీశ్వరా! 91

ప్రాచీనాసురతండముల్ చెలఁగి విధ్వంసంబు గావించఁగా
రోచిర్విక్రమరామమూర్తి వయి నిర్మూలంబు గావించి త
ర్వాచీనోగ్రప్రచండదానవతతుల్ బ్రహ్మాండసంక్షోభులై
యేఁచన్ ద్రుంచి జగంబు గాచుటకు రావే ప్రోవవే యీశ్వరా! 92

నాఁడెంతో మతవాదభేదముల నానాయుద్ధముల్ రేఁగి దు
ష్పీడల్ హత్యలు దోపిడుల్ మొదలుగా విధ్యంసముల్ సాగె నీ
నాఁడున్ దన్మతభేదఘాతుకక్రియోన్మాదంబుతో వర్గముల్
తోడై జాతిని జీల్చి కూల్చు నకటా! దుర్దాంతమై యీశ్వరా! 93

బహుసంతానము గన్నవారి నరకప్రాయవ్యథల్ తత్పితా
మహుఁడున్ గాంచఁడు, పుత్రహీనులకు సన్మానంబులున్ సద్గతుల్
నహి యన్నన్ సుతు లిద్దరో ముగురొ యున్నన్ శాంతిసౌఖ్యంబులౌ
నిహమున్ బైనఁ బరంబుఁగల్గు భువి కెంతేనిన్ జయం బీశ్వరా! 94

జీవుల్ తల్లుల పాలు శైశవమునన్ సేవింతు రామీఁదటన్
జీవంబుల్ గలయంత కాలము నిజక్షీరామృతాసారసం
జీవిన్ జేవగ నిచ్చు గోవులు వరశ్రీలన్ బ్రసాదించు నా
గోవుల్ దైవతముల్ సుపుష్టి తనరన్ గొల్వన్ శుభంబీశ్వరా! 95

భవరోగంబులు బాపు వైద్యుఁడవు దేవా! భౌతికంబౌ తనూ
ద్భవరోగంబులు బాపు టెంత? సకలబ్రహ్మాండభాండంబులే
యవలీలన్ భరియించు వల్లభుఁడవీ యల్పున్ భరించంగ నే
యవరోధంబు? పరాత్పరా! యభయ మీయన్ రావె యో యీశ్వరా!

బహువర్షార్జితసిద్ధమౌ ననుభవ వ్రాతంబు వృద్ధాప్యధూ
ర్వహమై వ్యర్థ మగున్, హిమాంబువిలసద్వర్షంబులో ఘోరవ
వ్రజహతుల్ గూల్చు, సుగంధపుష్పలతలన్ సర్వోత్కరాభీలతల్,
విహరింపన్ భయ మెందు శ్రేయ మెటులౌ విడ్డూర మే మీశ్వరా! 57

ప్రగతిన్ గాంచఁ దలంచు సాధకునకున్ బ్రత్యూహముల్ రుగ్మతల్
విగతార్థం బగు దుస్స్థితుల్, పయిరుకున్ వెల్లై తెగుల్ పోషకం
బగు నెర్వుల్ కఱవైన నేకరణిఁ బెంపై సత్ఫలం బిచ్చు నో
జగదీశా! దయ స్వాస్థ్యసంపదలతో సాఁకం గదే! యీశ్వరా! 58

వేదజ్ఞానవిశిష్టదీధితులచే విశ్వంబు వెల్గించుచున్,
పాదై సర్వకళాలతాప్రతతికిన్, బ్రాపంచికాముష్మిక
శ్రీదంబై, సకలంబు నీవె యను దృష్టిన్ లోక కల్యాణకాం
క్షాదైవం బగు భారతీయత నపేక్షన్ గొల్తు నోయీశ్వరా! 99

సత్యంబై శివమై మనోజ్ఞమగు విశ్వశ్రేయమై సర్వతా
లాత్యంతోదయమై యిహంబుఁ బరమున్ బ్రాప్తించఁగాఁ జేయు సా
హిత్యంబున్ సృజియించి నిన్ గొలుతుఁ దండ్రీ! సత్కవిత్వంబె సాం
గత్యంబై తరియింతు నీ కరుణచేఁ గావం గదే! యీశ్వరా! 100

ప్రకటం బైన కొరుట్లవాసుఁడను లింబయ్యాఖ్యాభూదేవిపు
త్రకుఁడన్ బోధనకావ్యసాధనలలో వర్ధిల్లు నే సందెవేం
కటరాజాఖ్యుఁడ సేవయిన్ శతకమున్ గావించి యోగీంద్రదే
శికగోవిందగిరిప్రభున్ బతిగఁ బూజింతున్ సదా యీశ్వరా! 101

—: o :—

అందె వేంకటరాజము

"కవిశిరోమణి", "అవధానయువకేసరి"

## డా॥ అందె వేంకటరాజము

జననం : 14-10-1933 - శ్రీముఖ - ఆశ్వయుజ బ॥ నవమి

జన్మస్థలం : కోరుట్ల, జిల్లా : కరీంనగర్

విద్యార్హతలు : ఎం.ఏ.; పిహెచ్.డి.

జననీ జనకులు : శ్రీమతి భూదేవి, శ్రీ లింబయ్య

వృత్తి : రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకుడు,
గృహవాస్తు పండితుడు.

రచనలు - ముద్రితములు : నవోదయము (కవితా సంపుటి)
మణిమంజూష ( ,, )
భారతరాణి (నాటికల సంపుటి)
భువన విజయము (నాటిక)
వానమామలై వరదాచార్యులవారి
కృతులు-అనుశీలనము (సిద్ధాంత గ్రంథం)
మానసవీణ (కవితా సంపుటి)
ఈశ్వరశతకము
మాధవవర్మ (నాటకము)

అముద్రితములు : సాహితీ జీవన తరంగాలు
(సాహిత్య వ్యాసాలు)
అవధాన పద్యమంజరి
కళాతపస్విని (కావ్యం)
భజన గీతాలు